# అథ పంచాశత్తమోఽధ్యాయః

## శుక్రుడు మృతసంజీవనీ విద్యను సంపాదించుట

సనత్కుమార ఉవాచ |

శృణు వ్యాస యథా ప్రాప్తా మృత్యుప్రశమనీ పురా | విద్యా కావ్యేన మునినా శివాన్మృత్యుంజయాభిధాత్ || 1

పురాసౌ భృగుదాయాదో గత్వా వారాణసీం పురీమ్ | బహుకాలం తపస్తేపే ధ్యాయన్ విశ్వేశ్వరం ప్రభుమ్ || 2

స్థాపయామాస తత్రైవ లింగం శంభోః పరాత్మనః | కూపం చకార సద్రమ్యం వేదవ్యాస తదగ్రతః || 3

పంచామృతైర్ద్రోణమితైర్లక్షకృత్వః ప్రయత్నతః | స్నాపయామాస దేవేశం సుగంధస్నపనైర్బహు || 4

సహస్రకృత్వో దేవేశం చందనైర్యక్ష కర్దమైః | సమాలిలింప సుప్రీత్యా సుగంధోద్వర్త నాన్యను || 5

రాజ చంపకధత్తూరైః కరవీర కుశేశ##యైః | మాలతీకర్ణికారైశ్చ కదంబైర్బకులోత్పలైః || 6

మల్లికాశతపత్రీభిస్సిందువారైస్సకింశుకైః | బంధూకపుష్పై#ః పున్నాగైర్నాగకేశరకేశ##రైః || 7

నవమల్లీచిబిలికైః కుంద్రైస్సముచుకుందకైః | మందారైర్బిల్వ పత్రైశ్చ ద్రోణైర్మరువకైర్వృకైః ||

గ్రంథిపర్ణైర్దమనకైస్సురమ్యై శ్చూతపల్లవైః || 8

తులసీ దేవగంధారీ బృహత్పత్రీ కుశాంకురైః | నంద్యావర్తై రగస్త్యైశ్చ సశాలైర్దేవదారుభిః || 9

కాంచనారైః కురవకై ర్దూర్వాంకుర కురుంటకైః | ప్రత్యేకమేభిః కుసుమైః పల్లవైరపరైరపి || 10

పత్రైస్సహస్ర పత్రైశ్చ రమ్యైర్నానా విధైశ్శుభైః | సావధానేన సుప్రీత్యా స సమానర్చ శంకరమ్ || 11

సనత్కుమారుడిట్లు పలికెను -

ఓ వ్యాసా! పూర్వము శుక్రమహర్షి మృత్యుంజయుడను పేరు గల శివుని వద్దనుండి మృతసంజీవనీ విద్యను సంపాదించిన వృత్తాంతమును వినుము (1). భృగువంశజుడగు ఈ శుక్రుడు పూర్వము కాశీనగర మునకు వెళ్లి విశ్వేశ్వరప్రభుని ధ్యానిస్తూ చిరకాలము తపస్సును చేసెను (2). ఓ వేదవ్యాసా! ఆతడచటనే పరమాత్మయొక్క లింగము నొకదానిని స్థాపించి దానియెదుట ఒక మంచి అందమగు నూతిని నిర్మించెను (3). ఆతడు కుంచము పరిమాణముగా గల పంచామృతములతో శ్రద్ధాపూర్వకముగా ఆ దేవదేవుని లక్షసార్లు అభిషేకించెను. మరియు పరిమళభరితములు జలములతో పలుమార్లు అభిషేకించెను. (4). ఆ దేవదేవునకు చందనముతో మరియు యక్షకర్దమము (కర్పూరము, మృగనాభి, గంధపు చెక్క ఇత్యాదులతో చేసిన ముద్ద) తో వేయిసార్లు పరమప్రీతితో సుగంధ లేపనములను చేసెను (5). రాజ చంపకములు, ధత్తూరములు, గన్నేరు పువ్వులు, పద్మములు, జాజి, కొండగోగు, కడప పుష్పములు, బకుల పుష్పములు, నల్లకలువలు (6). మల్లెలు, వావిలి పువ్వులు, కింశుకములు, మంకెనలు, సురపొన్నలు, నాగకేసరములు, పొగడలు (7), విరజాజులు, రక్తదళములు, కుందపుష్పములు, ముచుకుందములు, మందారములు, మారేడు పత్రములు, నీలిచెట్టు పుష్పములు, మరువము, ధూపము, మాచిపత్రి, దమనకము, మిక్కిలి అందమైన మామిడి చిగుళ్లు (8). తులసి, దేవగంధారి, వాకుడు వృక్షముల పత్రములు, దర్భచిగుళ్లు, నంద్యావర్తపుష్పములు, అగస్త్య శాలదేవదారు పుష్పములు (9), ములు గోరింటలు, దూర్వలు, చిగుళ్లు, పచ్చగోరింటలు ఇత్యాది పుష్పములన్నింటితో మరియు ఇతరములగు చిగుళ్లతో (10), పత్రములతో, సహస్రదళ పద్మములతో, నానావిధములైన శుభకరమగు పత్రపుష్పములతో ఆతడు సావధానమనస్కుడై మహాప్రీతితో శంకరుని చక్కగా అర్చించెను (11).

గీతనృత్యోపహారైశ్చ సంస్తుతస్తుతిభిర్బహు | నామ్నాం
సహస్రై#్రరన్యైశ్చ స్తోత్రైస్తుష్టావ శంకరమ్ ||

సహస్రం పంచశరదామిత్థం శుక్రో మహేశ్వరమ్ | నానాప్రకార
విధినా మహేశం స సమర్చయత్ || 13

యదా దేవం నానులోకే మనాగపి వరోన్ముఖమ్ | తదాన్యం
నియమం ఘోరం జగ్రాహాతీవ దుస్సహమ్ || 14

ప్రక్షాల్య చేతసోఽత్యంతం చాంచల్యాఖ్యం మహామలమ్ |
భావనావార్భిరసకృదింద్రియైస్సహితస్య చ || 15

నిర్మలీకృత్య తచ్చేతో రత్నం దత్త్వా పినాకినే | ప్రయ¸ౌ
కణధూమౌఘం సహస్రం శరదాం కవిః || 16

కావ్యమిత్థం తపో ఘోరం కుర్వంతం దృఢమానసమ్ | ప్రససాద స
తం వీక్ష్య భార్గవాయ మహేశ్వరః || 17

తస్మాల్లింగా ద్వినిర్గత్య సహస్రార్కాధికద్యుతిః | ఉవాచ తం
విరూపాక్ష స్సాక్షా ద్దాక్షాయణీపతిః || 18

ఆతడు శంకరునకు నైవేద్యమును సమర్పించి గానమును వినిపించి నృత్యమును ప్రదర్శించి, అనేక స్తోత్రములతో మరియు సహస్రనామములతో చిరకాలము స్తుతించెడివాడు (12). ఆ శుక్రుడు ఈ తీరున పరిపరి విధములలో ఆ మహేశ్వరుని అయిదు వేల సంవత్సరములు ఆరాధించెను (13). ఆ దేవుడు వరమునిచ్చే సూచన లేశ##మైననూ కానరాలేదు. అపుడు ఆతడు మిక్కిలి దుస్సహమగు మరియొక భయంకర నియమమును చేపట్టెను (14). ఆతడు ఇంద్రియములతో గూడి యున్న మనస్సు యొక్క చంచలత అనే మహాదోషమును భక్తి అను జలములతో నిశ్శేషముగా ప్రక్షాళన చేసెను (15). ఆ విధముగా పరిశుద్ధమైన మనస్సు అనే రత్నమును పినాకధారియగు శివునకు సమర్పించి ఆ శుక్రుడు కాలిన ఊకనుండి వచ్చే పొగను పీలుస్తూ వేయి సంవత్సరములు తపస్సును చేసెను (16). ఈ విధముగా దృఢచిత్తముతో భృగువంశజుడగు శుక్రుడు ఘోరమగు తపస్సును

చేయుచుండుటను గాంచి మహేశ్వరుడు ప్రసన్నుడాయెను (17). సతీదేవికి పతి, ముక్కంటి అగు ఆ దేవుడు స్వయముగా ఆ లింగమునుండి వేయి సూర్యుల కంటె అధిక కాంతితో ఆవిర్భవించి ఆతనితో నిట్లనెను (18).

మహేశ్వర ఉవాచ |

తపోనిధే మహాభాగ భృగుపుత్ర మహామునే | తపసానేన తే నిత్యం ప్రసన్నోeôహం విశేషతః || 19

మనోభిలషితం సర్వం వరం వరయ భార్గవ | ప్రీత్యా దాస్యేeôఖిలాన్ కామాన్నాదేయం విద్యతే తవ || 20

మహేశ్వరుడిట్లు పలికెను -

ఓ తపోనిధీ! మహాత్మా! భార్గవమహర్షీ! నీవు నిత్యము చేయుచున్న ఈ తపస్సుచే నేను చాల ప్రసన్నుడనైతిని (19). ఓ భార్గవా! నీ మనస్సులోని కోర్కెలనన్నిటినీ కోరుకునుము. నేను నీ కోర్కెలనన్నిటినీ ప్రీతితో నెరవేర్చెదను. నీకు ఈ యదగనిది లేదు (20).

సనత్కుమార ఉవాచ |

నిశ##మ్యేతి వచశ్శంభోర్మహాసుఖకరం వరమ్ | స బభూవ కవిస్తుష్టో నిమగ్నస్సుఖవారిధౌ || 21

ఉద్యదానందసందోహరోమాంచాంచిత విగ్రహః | ప్రణనామ ముదా శంభుమంభోజనయనో ద్విజః || 22

తుష్టావాష్టతనుం తుష్టః ప్రఫుల్ల నయనాంచలః | మౌలావంజలిమాధాయ వదన్ జయ జయేతి చ || 23

సనత్కుమారుడిట్లు పలికెను -

శంభుని మహానందదాయకమగు ఈ శ్రేష్ఠవచనమును విని ఆ శుక్రుడు ఆనందసముద్రములో ఓలలాడుతూ సంతోషించెను (21). ఉప్పొంగు చున్న ఆనందప్రవాహముచే కలిగిన రోమాంచముతో నిండిన దేహము గలవాడు, పద్మముల వంటి నేత్రములు గలవాడు అగు ఆ బ్రాహ్మణుడు ఆనందముతో శంభుని ప్రణమిల్లెను (22). ఆయన సంతోషముతో వికసించిన కన్నులు గలవాడై శిరస్సుపై చేతులను జోడించి జయ జయ ధ్వానములను చేయుచూ అష్టమూర్తియగు శివుని స్తుతించెను (23).

భార్గవ ఉవాచ |

త్వంభాభిరాభిరభిభూయ తమస్సమస్తమస్తం నయస్యభి మతాని నిశాచరాణామ్ |

దేదీప్యసే దివమణ    గగనే హితాయ లోకత్రయస్య జగదీశ్వర తన్నమస్తే || 24

లోకేeఁతి వేలమతి వేల మహామహోభిర్నిర్భాసి కౌ చ గగనేeఁఖిలలోక నేత్రః |

విద్రావితాఖిల తమాస్సుతమో హిమాంశో పీయూషపూర పరిపూరిత తన్నమస్తే || 25

త్వం పావనే పథి సదాగతిరప్యుపాస్యః కస్త్వాం వినా భువనజీవన జీవతీహ |

స్తబ్ధప్రభంజనవివర్ధిత సర్వజంతోః సంతోషితాహికుల సర్వగ వై నమస్తే || 26

విశ్వైక పావక న తావకపావకైకశ##క్తేర్ ఋతే మృతవతామృత దివ్యకార్యమ్ |

ప్రాణిష్యదో జగదహో జగదంతరాత్మంస్త్వం పావకః ప్రతిపదం శమదో నమస్తే || 27

పానీయరూప పరమేశ జగత్పవిత్ర చిత్రం విచిత్ర సు చరిత్ర కరోeôసి నూనమ్ |

విశ్వం పవిత్రమమలం కిల విశ్వనాథ పానీయగాహనత ఏతదతో నతోeôస్మి || 28

ఆకాశరూప బహిరంతరుతావకాశ దానా ద్వికస్వరమిహేశ్వర విశ్వమేతత్ |

త్వత్తస్సదా సదయ సంశ్వసితి స్వ భావాత్సంకోచమేతి భవతోeôస్మి నత్తస్తతస్త్వామ్ || 29

విశ్వం భరాత్మక బిభర్షి విభోeôత్ర విశ్వం కో విశ్వనాథ భవతోeôన్య తమస్తమోeôరిః |

స త్వం వినాశయ తమో తమ చాహిభూష స్తవ్యాత్పరః పరపరం ప్రణతస్తతస్త్వామ్ || 30

ఆత్మస్వరూప తవ రూపపరం పరాభిరాభిస్తతం హర చరాచర రూపమేతత్ |

సర్వాంతరాత్మనిలయ ప్రతిరూపరూప నిత్యం నతోeôస్మి పరమాత్మజనోeôష్టమూర్తే || 31

ఇత్యష్టమూర్తిభిరిమాభిర బంధుబంధో యుక్తౌ కరోషి ఖలు విశ్వజనీనమూర్తే |

ఏతత్తతం సువితతం ప్రణతప్రణీత సర్వార్థ సార్థపరమార్థ తతో నతోeôస్మి || 32

శుక్రాచార్యుడిట్లు పలికెను -

నీవు ఈ కాంతులతో చీకట్లనన్నిటినీ పారద్రోలి రాక్షసుల మనోరథములను ధ్వంసమొనర్చుచున్నావు. ఓ జగత్పతీ! సూర్యరూపా! నీవు లోకహితము కొరకై ఆకాశమునందు వెలిగిపోవుచున్నావు. నీకు నమస్కారము (24). ఓ చంద్రా! నీవు

జనులకు కన్ను వంటి వాడవు. నిన్ను చూచి భూమిపై గల సముద్రము పెద్ద పెద్ద కెరటములతో ఉప్పొంగి చెలియలి కట్టను దాట గోరుచున్నది. నీవు ఆకాశములో ప్రకాశిస్తూ నీ చల్లని కిరణములతో చీకట్లనన్నిటినీ పారద్రోలి జగత్తును వెన్నెలలనే అమృత ధారలతో ముంచెత్తుచున్నావు. నీకు నమస్కారము (25). ఓ వాయూ! నీవు పవిత్రమగు అంతరిక్షమార్గములో సంచరిస్తూ సర్వమును వ్యాపించుచున్నావు. లోకుల ప్రాణశక్తి స్వరూపుడగు నీవు లేనిదే ఏ జీవి బ్రతుకగలదు? నీవు ఒకప్పుడు కదలిక లేదా యన్నట్లు ఉండి మరుక్షణములో తుఫాను రూపమును దాల్చెదవు. సర్వప్రాణులను వర్ధిల్లజేయు నీకు నమస్కారము. నీవు సర్ప సముదాయములకు భోజనమై వాటిని సంతోషపెట్టెదవు (26). జగత్తును పవిత్రము చేయు ఏకైక మూర్తివగు ఓ అగ్నీ! నీ పవిత్రీకరణ శక్తి లేనిచో ఈ లోకము మృతప్రాయమగును. జగత్తునకు అంతరాత్మవగు నీవు అమృతస్వరూపమగు హవిస్సును దేవతల కొసంగి వారికి ఉపకారములను చేయుచున్నావు. నిన్ను మ్రొక్కు ప్రాణులకు నీవు ప్రతి అడుగులో శాంతిని కలిగించెదవు. నీకు నమస్కారము (27). జలరూపములో నుండి సర్వమును శుద్ధి చేయు ఓ పరమేశ్వరా ! నీ గొప్ప చరిత్రలు నిశ్చయముగా అద్భుతములు. ఓ విశ్వనాథా ! ఈ జగత్తులోని సర్వము నీ స్వరూపమగు జలములో మునకవేసి పవిత్రమగుచున్నది. అట్టి ఈ జలరూపుడవగు నీకు నమస్కారము (28). ఆకాశరూపములో నున్న ఓ ఈశ్వరా! శబ్దము గుణముగా గల నీవు లోపల, బయట అవకాశము నిచ్చుట చేతనే ఈ జగత్తు మనగల్గుచున్నది. ఓ దయామూర్తీ! నీకు నేను నమస్కరించుచున్నాను (29)స్వస్వరూపమగు విశ్వమును పాలించి పోషించువాడా! సర్వవ్యాపీ! ఈ విశ్వమును నీవే పృథివీరూపములో ధరించియున్నావు. అజ్ఞానమును పోగొట్ట గల దైవము నీవు తక్క మరియెవరు గలరు? సర్పములు అలంకారముగా గలవాడా! మా ఈ చీకట్లను నీవు పారద్రోలుము. సర్వాతీతుడవగు నీవు స్తోత్రములకు అతీతుడవు. అట్టి నీకు ప్రణమిల్లుచున్నాను (30). ఓయీ ఆత్మ స్వరూపుడవగు హరా ! ఈ చరాచర జగత్తు అంతయు నీ ఈ రూపముల వరుసలచే నిండి యున్నది. ఓయీ అష్టమూర్తీ!

సర్వప్రాణుల అంతరాత్మ నీ నివాసస్థానము. పరమాత్మవగు నీకు భక్తుడనగు నేను నిత్యము నమస్కరించుచున్నాను (31). బంధువులు లేని వారికి బంధుడవు నీవే. ఈ జగత్తు సర్వము నీ స్వరూపమై యున్నది. నీవీ ఎనిమిది రూపములతో ఈ జగత్తు నంతనూ వ్యాపించి యున్నావు. నిన్ను నమస్కరించు భక్తుల కోర్కెల నన్నిటినీ నీవు ఈడేర్చెదవు. పరమార్థము నీస్వరూపమే. అట్టి నీకు నమస్కరించు చున్నాను (32).

సనత్కుమార ఉవాచ |

అష్ట మూర్త్యష్టకేనేత్థం పరిష్టుత్యేతి భార్గవః | భర్గం భూమిమిలన్మౌలిః ప్రణనామ పునః పునః || 33

ఇతి స్తుతో మహాదేవో భార్గవేణాతి తేజసా | ఉత్థాయ భూమేర్బాహుభ్యాం ధృత్వా తం ప్రణతం ద్విజమ్ || 34

ఉవాచ శ్లక్ష్ణయా వాచా మేఘనాదగభీరయా | సుప్రీత్యా దశనజ్యోత్స్నా ప్రద్యోతితదిగంతరః || 35

సనత్కుమారుడిట్లు పలికెను -

భార్గవుడు ఈ విధముగా శివుని అష్టమూర్తి - అష్టకముతో చక్కగా స్తుతించి తలను నేలకు ఆన్చి పలుమార్లు ప్రణమిల్లెను (33). గొప్ప తేజశ్శాలి యగు భార్గవునిచే ఈ విధముగా స్తుతించ బడిన మహాదేవుడు సాష్టాంగ పడిన ఆ బ్రాహ్మణుని చేతులతో భూమినుండి పైకి లేవదీసి పట్టుకొని (34), మేఘధ్వని వలె గంభీరమైన మృదు వచనములతో ప్రేమ పూర్వకముగా ఇట్లు పలుకు చుండగా ఆయన దంతకాంతులచే దిక్కులన్నియు వెలిగి పోయెను (35).

మహాదేవ ఉవాచ |

విప్రవర్య కవే తాత మమ భక్తోఽసి పావనః | అనేనాత్యుగ్రతపసా స్వజన్యాచరితేన చ ||

లింగస్థాపనపుణ్యే న లింగస్యారాధనేన చ | దత్త చిత్తోపహారేణ శుచినా నిశ్చలేన చ || 37

అవిముక్త మహాక్షేత్ర పవిత్రాచరణ న చ | త్వాం సుతాభ్యాం ప్రపశ్యామి తవాదేయం న కించన || 38

అనేనైవ శరీరేణ మమోదరదరీగతః | మద్వరేంద్రియ మార్గేణ పుత్రజన్మత్వమేష్యసి || 39

యచ్ఛామ్యహం వరం తేఽద్య దుష్ప్రాప్యం పార్షదైరపి | హరేర్హిరణ్యగర్భాచ్చ ప్రాయశోఽహం జుగోప యమ్ || 40

మృతసంజీవనీ నామ విద్యా మమ యా నిర్మలా | తపోబలేన మహతా మయైవ పరినిర్మితా || 41

త్వాం తాంతు ప్రాపయామ్యద్య మంత్రరూపాం మహాశుచే | యోగ్యతా తేఽస్తి విద్యాయాస్తస్యాశ్శుచితపోనిధే || 42

మహాదేవుడిట్లు పలికెను -

ఓ బ్రాహ్మణ శ్రేష్ఠా! వత్సా! శుక్రా! నీవు భక్తుడవు. పవిత్రుడవు. నీ ఈ ఘోరమగు తపస్సు చేత, ఈ తపస్సును ఈ జన్మలో ఆచరించుట చేత (36), లింగమును స్థాపించిన పుణ్యము చేత, లింగము నారాధించుట చేత, పవిత్రము నిశ్చలము అగు మనస్సును నాకు ఉపహారముగా సమర్పించుట చేత (37), కాశీమహాక్షేత్రములో పవిత్రముగా జీవించుట చేత, నిన్ను నా ఇద్దరు పుత్రులతో సమానముగా చూచుచున్నాను. నీకు ఈయదగని వరము లేదు (38). నీవు ఇదే శరీరముతో నా ఉదరమనే గుహలో ప్రవేశించి నా ఇంద్రియ మార్గము గుండా పుత్రరూపములో జన్మించగలవు (39). నా కింకరులైననూ పొంద శక్యముకాని వరమును నీకీనాడు ఇచ్చుచున్నాను. నేనీ వరమును విష్ణు బ్రహ్మలకు తెలియకుండగా రహస్యముగా నుంచితిని (40). నేను నా యొక్క తపోబలముచే స్వయముగా నిర్మించిన నిర్మలమైన మృతసంజీవనీ విద్య గలదు

(41). మహాపవిత్రుడా! ఈ నాడు ఆ విద్యను నీకు నేర్పెదను. నీవు శుచిత్వమునకు, తపస్సునకు నిధివి. ఆ విద్యను పొందే అర్హత నీకు గలదు (42).

యం యముద్దిశ్య నియతమేతామావర్తయిష్యసి | విద్యాం విద్యేశ్వరశ్రేష్ఠాం సత్యం ప్రాణిష్యతి ధ్రువమ్ || 43

అత్యర్కమత్యగ్ని చ తేజో వ్యోమ్ని చ తారకమ్ | దే దీప్యమానం భవితా గ్రహాణాం ప్రవరో భవ || 44

అపి చ త్వాం కరిష్యంతి యాత్రాం నార్యో నరోeôపి వా | తేషాం త్వద్దృష్టిపాతేన సర్వం కార్యం ప్రణశ్యతి || 45

తవోదయే భవిష్యంతి వివాహాదీని సువ్రత | సర్వాణి ధర్మకార్యాణి ఫలవంతి నృణామిహ || 46

సర్వాశ్చ తిథయో నందాస్తవ సంయోగతశ్శుభాః | తవ భక్తా భవిష్యంతి బహుశుక్రా బహుప్రజాః || 47

త్వయేదం స్థాపితం లింగం శుక్రేశమితి సంజ్ఞితమ్ | యేeôర్చయిష్యంతి మనుజాస్తేషాం సిద్ధిర్భవిష్యతి || 48

ఆవర్షం ప్రతిఘస్రాం యే నక్త వ్రత పరాయణాః | త్వద్దినే శుక్రకూపే యే కృతసర్వోదకక్రియాః || 49

శుక్రేశమర్చ యిష్యంతి శృణు తేషాంతు యత్ఫలమ్ | అవంధ్య శుక్రాస్తే మర్త్యాః పుత్రవంతోeôతిరేతసః || 50

పుంస్త్వ సౌభాగ్య సంపన్నా భవిష్యంతి న సంశయః | ఉపేత విద్యాస్తే స్వే జనాస్స్యుస్సుఖభాగినః || 51

ఇతి దత్వా వరాన్ దేవస్తత్ర లింగే లయం య¸° | భార్గవోeôపి నిజం ధామ ప్రాప సంతుష్టమానసః || 52

ఇతి తే కథితం వ్యాస యథా ప్రాప్తా తపోబలాత్ | మృత్యుంజయాభిధా విద్యా కిమన్య చ్ఛ్రోతుమిచ్ఛసి || 53

ఇతి శ్రీ శివమహాపురాణ   రుద్ర సంహితాయాం యుద్ధఖండే
మృత్యు సంజీవనీ విద్యాప్రాప్తి వర్ణనం నామ
పంచాశత్తమోఽధ్యాయః (50)

నీవు ఏ జీవిని ఉద్దేశించి యైననూ శ్రద్ధతో విద్యలలోకెల్లా గొప్పది యగు ఈ విద్యను పఠించినచో, ఆ జీవి నిశ్చయముగా మరల జీవించును. ఇది సత్యము (43). ఆకాశమునందు నీవు గ్రహరూపుడవై సూర్యుని, అగ్నిని అతిశయించిన ప్రకాశము గలవాడవై గొప్ప తేజస్సుచే గ్రహములలో శ్రేష్ఠుడవు కాగలవు (44). మరియు నీకు అభిముఖముగా పురుషులు గాని, స్త్రీలు గాని యాత్రను చేసినచో, నీ దృష్టి పడుటచే వారి కార్యమంతయు నాశము కాగలదు (45). ఓ గొప్ప వ్రతము గలవాడా! భూలోకములో నీవు ఉదయించిన కాలములో మానవులు వివాహాది సమస్త ధర్మకార్యములను చేసినిచో, అవి సఫలము కాగలవు (46). నంద తిథులన్నియు నీ సంయోగముచే శుభకరములగును. నీ భక్తులు అధిక సంతానము గలవారగుదురు (47). నీచే స్థాపించబడిన ఈ లింగమునకు శుక్రేశ్వరుడని పేరు. దీనిని అర్చించు మానవులు సిద్ధిని బడయగలరు (48). ఒక సంవత్సరకాలము ప్రతి దినము రాత్రియందు వ్రతనిష్ఠ గలవారై నీ దినమునాడు శుక్ర కూపములో ఉదకక్రియలన్నిటినీ చేసి (49). శుక్రేశుని అర్చించువారికి లభించు ఫలమును చెప్పెదను వినుము. పురుషులు బలశాలురై అధిక సంతానమును పొంది, పౌరుష సంపన్నులగుదురునుటలో సందేహము లేదు. వారు విద్యావంతులై సుఖములను బడయుదురు (50, 51). ఆ దేవుడు ఈ విధముగా వరములనిచ్చి అచటనే లింగములో విలీనమాయెను. శుక్రుడు కూడ సంతోషముతో నిండిన మనస్సు గలవాడై తన నివాసమునకు చేరుకొనెను (52). ఓ వ్యాసా! శుక్రుడు తపోబలముచే మృత్యుంజయ విద్యను సంపాదించిన వృత్తాంతమును ఇంతవరకు నీకు చెప్పియుంటిని. ఇంకనూ ఏమి వినగోరుచున్నావు? (53)

శ్రీ శివ మహాపురాణములోని రుద్రసంహితయందలి యుద్ధఖండలో మృత్యుసంజీవనీ విద్యను శుక్రుడు పొందుటను వర్ణించే ఏబదియవ అధ్యాయము ముగిసినది (50).